१०१. गुरुणा श्रेय आसाद्य तस्मै द्रोहं करोति यः
मुच्यते सर्वसंपद्भ्य स्स हि प्राप्नोति दुर्यशः

१०२. गुरोराज्ञा शिरोधार्या नोल्लङ्घ्या हि कदाचन
आचार्यः पूज्यते यत्र भासते तत्र भारती

१०३. सुशिष्य स्स्वप्नकाले ऽपि गुरुद्रव्यं न वाञ्छति
कालसर्पसमं मत्वा परित्यजति दूरतः

१०४. गुरूणां मनसि क्षोभो येन शिष्येण जायते
तत्कृता निष्फलाः पूजाः पूर्वपुण्यंच नश्यति

१०५. गुरुमाश्रित्य सद्विद्याम् प्राप्य लोके यशो धनम्
कृतघ्नो भवति भ्रष्ट शिष्टो याति कृतज्ञताम्

१०६. प्रत्यक्षं वा परोक्षं वा गुरुं निन्दति यःपुमान्
तं जहाति महावाणी महालक्ष्म्या स मुच्यते

१०७. गुरर्देवो गुरुर्देवो गुरुर्देवो न संशयः
गुरुं नत्वा पुमान् श्रीमान् सर्वं श्रेयो ऽधिगच्छति

१०८. मकरन्दं समासाद्य गुरुदेव पदाब्जयोः
श्रेयांसि शिष्यसारङ्गः प्राप्नोतीह परत्र च

१०९. वेदानाम् प्रणव श्श्रेष्ठो देवतानां गुरुर्घनः
येन मे जन्म साफल्यम् तस्मै श्रीगुरवे नमः

११०. नदीनामुत्तमा गंगा भूधराणां हिमालयः
दातृलोके गुरुश्श्रेष्ठ स्तस्मै श्रीगुरवे नमः

101. The man who gains prosperity by his master does harm to him will lose all his gains. At the same time he invites disrepute to himself.

102. Every disciple should obey his master's command with absolute resolution. He should never fail to discharge his obligation. Where the master is respected, there Goddess Saraswati shines.

103. A worthy disciple is never tempted by his master's wealth. He treats it as a deadly poisonous snake and remains aloof from it.

104. The offerings and prayers of the disciple go in vain if the master's- mind is agonized by the deeds of the disciple. At the same time he would loose the fruits of his earlier achievements.

105. The wicked disciple who approaches the master, learns from him well and earns wealth ltimately becomes ungrateful where as the worthy disciple wins his master's grace.

106. The disciple who accuses his master directly or indirectly will be abandoned by the Goddess of knowledge and the Goddess of wealth.

107. The master is God himself, God himself and God himself without any doubt. The man who respectfully salutes his master will become rich and receives his blessings in full.

108. The disciple who like a butter-fly drinks honey from the lotus feet of his master to his great satisfaction is blessed one in this world and in the world above.

109. The word 'OAM' is the greatest one in the VEDAS. The master is the greatest one among the deities. I salute that master by whom my life has become successful.

110. The Ganges is the best of all the rivers. The Himalaya is the greatest mountain of all the mountains. Of all the men of charity he who transmits knowledge is the greatest one. That one being the master, I salute him.

१११. श्रीकरी चाक्षरा विद्या  श्रेयोदात्रीच शर्मदा
येन मे हृदि निक्षिप्ता  तस्मै श्रीगुरवे नमः

इति कौण्डिन्यसगोत्रेण, कडिमिल्लवंशसञ्जातेन, बुच्चमाम्बा शेषय्य दंपत्योः

पौत्रेण, भारती वेङ्कट रामय्य शास्त्रि दम्पत्योः पुत्रेण गुरु सहस्रावधानिना वरप्रसादेन शैष्योपाध्यायिकायाः पवित्रतापरिरक्षणाय प्रणीतं गुरुवन्दनम् संपूर्णम्.

111. I salute that master a personification of education, the benefactor of all riches, that is indestruc tible, that which promotes prosperity, and gives happiness is planted in my heart.

Inglish Translator...
**Dr C. JACOB,**
Retd District Judge, Narsapur.



# గురు వన్దనమ్



గురు సహస్రావధానీ

**కడిమిళ్ళ వరప్రసాదః**

1. శ్రీదాత్రీ శుభదాత్రీచ
సర్వత్ర విజయప్రదా
విద్యా సా యేన మే దత్తా
తస్మై శ్రీగురవే నమః!!

2. సారస్వతేన లోకోఽయం
చైతన్యమధిగచ్ఛతి
తద్ధనం యేన మే దత్తం
తస్మై శ్రీగురవే నమః!!

3. పావనం కవితా రాజ్యం
భాషయో స్సంస్కృతాంధ్రయోః
దయయా యేన మే దత్తం
తస్మై శ్రీగురవే నమః!!

4. కవితా పూజ్యతే లోకే
నిర్మలా రసవర్ధినీ
దత్తా యా కృపయా యేన
తస్మై శ్రీగురవే నమః!!

5. పద్యమందార సంపూర్ణం
కపసం నందనం వనమ్
ప్రాంచితం యేన మే దత్తం
తస్మై శ్రీగురవే నమః!!

6. అవధాన కలారంగే
సుస్థితిర్యేన వర్ధితా
తస్య పాదాంబుజ ద్వంద్వం
ప్రణమామి నిరంతరమ్!!

# తాత్పర్యములు

1. సిరులను, శుభములను, అన్నియెడల విజయమును ప్రసాదించు విద్యను అనుగ్రహించిన గురువునకు నమస్కారము.

2. సారస్వతముచేతనే ఈ లోకము చైతన్యమును పొందుచున్నది. అటువంటి సారస్వత ధనమును నాకు అనుగ్రహించిన గురువునకు నమస్కారము.

3. పావనమైన కవితా రాజ్యమును సంస్కృతాంధ్ర భాషలలో దయతో నాకు అనుగ్రహించిన గురువునకు నమస్కారము.

4. కవిత లోకములో పూజలందుకొంటున్నది. నిర్మలమైనది. రసమును వృద్ధి చేయునది. అటువంటి కవితా శక్తిని నాకు అనుగ్రహించిన గురువునకు నమస్కారము.

5. పద్యములనే పారిజాతములతో నిండినది, అందరిచే ప్రశంసింపబడునది అయిన కవన రూపమైన నందన వనమును నాకు అనుగ్రహించిన గురువునకు నమస్కారము.

6. అవధాన కలారంగములో చక్కని స్థితి ఎవరివల్లన వృద్ధి పొందినదో ఆ గురుమూర్తి పాదపద్మ ద్వయాన్ని గూర్చి నిరంతరం ప్రణమిల్లుచున్నాను.

7. అష్టధా శతధాచైవ
తథైవచ సహస్రధా
యేనావధానితా ప్రాప్తా
తస్మై శ్రీగురవే నమః!!

8. పాండిత్యవైభవం బుద్ధౌ
వక్తృత్వం రసనాంచలే
కవిత్వం మమ హృద్దేశే
వర్తంతే కృపయా గురోః!!

9. గురుణా జాయతే జ్ఞానం
యేన లబ్ధం మహద్యశః
ప్రత్యక్షంచ పరోక్షంచ
కరోమి గురు భావనామ్!!

10. శిష్య మానస కేదారే
సస్యవర్ధన కారకమ్
కృషీవలం గురుం విద్యా
న్న కుర్యాద్ గురుదూషణమ్!!

11. పితరౌ జన్మ దాతారౌ
జ్ఞాన దాతాహి దేశికః
జీవికా తత్కృపాలబ్ధా
న కుర్యాద్గురుదూషణమ్!!

12. ఆదౌ గురుం నమస్కృత్య
కుర్యాద్దేవార్చనం తతః
గురుం హిత్వా కృతాం పూజామ్
న స్వీకుర్వంతి దేవతాః!!

7. అష్టావధానము, శతావధానము, సహస్రావధానము చేయగలుగు అవధాన శక్తి ఎవరివలన నాకు ప్రాప్తించినదో అట్టి గురువునకు నమస్కారము.

8. నా బుద్ధియందు పాండిత్య వైభవము, నాలుక కొనయందు ఉపన్యసించగల శక్తి, గుండెగూటిలో కవిత్వము గురువు దయవలననే వర్ధిల్లుచున్నవి.

9. గురువువలననే జ్ఞానము పుట్టుచున్నది. ఆ జ్ఞానమువలన కీర్తి లభించుచున్నది. అందువలన ప్రత్యక్షముగాను, పరోక్షముగాను కూడ గురువునే భావించుచుందును.

10. శిష్యుని మానసము అనే పొలములో పంట పండుటకు కారకుడైన కృషీవలుడు గురువు. కనుక గురు దూషణము చేయరాదు.

11. తల్లిదండ్రులు జన్మను ప్రసాదిస్తారు. గురువు జ్ఞానమును ప్రసాదిస్తాడు. బ్రతుకు తెరువుకూడ ఆ గురువు కృపతోనే లభిస్తుంది.కనుక గురువును దూషింపరాదు.

12. ముందుగా గురువును నమస్కరించి, ఆ పిదప దేవతార్చనము చేయవలెను. గురువును విడిచిపుచ్చి, చేసిన పూజను దేవతలు స్వీకరింపరు.

13. అజ్ఞాన సర్పదష్టాయ
గురు స్సంజీవనౌషధమ్
దదాతి జ్ఞాన రూపేణ
తస్మిన్ కార్యా కృతజ్ఞతా!!

14. యాంత్రికే ఖలు సంసారే
సాగరే పతితం నరమ్
ప్రోద్ధర్తుం శక్త ఆచార్యో
గురుదేవం న విస్మరేత్!!

15. గురు జైవాతృక జ్యోత్స్నా
పాతి శిష్య చకోరకమ్
శాంత తృష్ణేనచానేన
న త్యాజ్యాహి కృతజ్ఞతా!!

16. గురు కల్పకమాశ్రిత్య
లబ్ధ్వా జ్ఞానాత్మకం సుమమ్
తత్సుగంధం సమాఘ్రాయ
న కుర్యాద్ద్రుమ కర్తనమ్!!

17. ఆచార్య సహకారేణ
వర్ధంతే ఛ్ఛాత్ర కోకిలాః
గానం లబ్ధ్వా యశః ప్రాప్య
తం రసాలం న విస్మరేత్!!

18. జ్ఞానాకాశ విహారీ హి
గురు మేఘోఽభివర్షతి
సత్పాత్రే శిష్యకేదారే
స్మరేన్నిత్యం గురుం ఘనమ్!!

13. అజ్ఞానమనే పాముకాటుకు గురియైన వానికి గురువే జ్ఞానరూపమైన సంజీవనౌషధమును అందించును. కనుక వానియందు కృతజ్ఞత కలిగియుండవలెను.

14. యాంత్రికమైన సంసార సాగరంలో పడి కొట్టుమిట్టాడే నరుని ఉద్ధరించగల శక్తి గురువునకు మాత్రమే ఉన్నది. కనుక గురుదేవుని విస్మరింపరాదు.

15. శిష్యుడనే చకోర పక్షియొక్క దప్పిక గురుచంద్రుడు ప్రసరించే వెన్నెల ద్వారానే తీరుతుంది. ఆ జ్ఞాన దాహము తీరిపోయిన తరువాతకూడ కృతజ్ఞతను మాత్రము విడువరాదు.

16. గురువు అనే కల్పవృక్షాన్ని ఆశ్రయించి, జ్ఞానమనే పుష్పాన్ని స్వీకరించి, దాని సుగంధాన్ని ఆఘ్రాణించి, తరువాత ఆ చెట్టునే నరకరాదు.

17. గురువనే తియ్యమామిడి చెట్టును ఆశ్రయించి, శిష్యకోకిలలు వృద్ధి పొందును. గానశక్తిని, కీర్తిని పొందిన తరువాత ఆ రసాలవృక్షమును విస్మరింపరాదు.

18. జ్ఞానమనే ఆకాశంలో విహరించే గురువనే మేఘుము శిష్యుడనే పంటపొలములో వర్షించును. కనుక ఆ గురు మేఘుమును ఎల్లప్పుడు స్మరింపవలెను. (ఘునము అనగా మేఘుము అనియు అర్థము.)

19. సర్వేష్వపిచ కాలేషు
సర్వావస్థాసు సర్వధా
కృపాహి గురుదేవస్య
స్థితా భవతి రక్షణే!!

20. అవ్యవస్థా భవత్యేవ
కూలం ఛిత్వా ప్రవాహినీ
శిష్య జీవన సర్వస్వం
గురు కూలాభిరక్షణమ్!!

21. సర్వేష్వపిచ దేశేషు
నదీ కూలాభిరక్షితా
గురు కూలం తిరస్కృత్య
హ్యగమ్యం శిష్య జీవనమ్!!

22. దత్తా యేనాక్షరా విద్యా
తస్మై వందనమాచరేత్
గురోరాశీర్బలేనైవ
ప్రాప్నోతి విజయం నరః!!

23. అభిషేకోహ్యలంకారో
హరాయ హరయే తథా
భాస్కరాయ నమస్కారో
గురవేతు కృతజ్ఞతా!!

24. వృక్షః పాదబలేనైవ
దదాతి మధురం ఫలమ్
పాదమూలం తరుం విద్యాత్
గురు మూలం మనీషిణమ్!!

19. అన్ని కాలములయందు, అన్ని అవస్థలయందు ( బాల్య యౌవన, కౌమార, వార్థక అవస్థలయందుకూడ) కేవలం గురువుయొక్క అనుగ్రహము మాత్రమే మనలను రక్షింపగలదు.

20. గట్టును ఛేదించిన నదియొక్క ప్రవాహ గతి క్రమ రహితమై నిరర్ధకమైపోవును. అటులే శిష్యుని జీవనమంతయు గురువనే ఒడ్డుచేత మాత్రమే రక్షింపబడుచుండును.( జీవనము అనగా నీరు అనియు అర్ధము.)

21. ఏదేశమందయినా నదికి గట్టే రక్షణము. గురువనే గట్టును కాదన్నవాని జీవనము అగమ్యముగా తయారగును.

22. ఎవరిచేత అక్షర రూపమైన (శాశ్వతమైన) విద్య ప్రసాదింపబడినదో అట్టి గురువునకు వందనమాచరింపవలెను. గురువుయొక్క దీవెనలకు ఉన్న బలముచేతనే మానవుడు విజయమును పొందగలడు.

23. శివునకు అభిషేకము, విష్ణువునకు అలంకారము, సూర్యునకు నమస్కారము ముఖ్యమైనట్లే గురువు విషయములో కృతజ్ఞత ప్రధానము.

24. చెట్టు దాని వేరు బలముచేతనే మధురమైన ఫలాన్ని ఇవ్వగలుగుతుంది. అలాగే ఒక మేధావిని దర్శించినపుడు ఆ శక్తికి మూలము వాని గురువని గుర్తింపవలెను.

25. దివా కాంతిం దదాత్యర్కో
రాత్రి భాగేతు చంద్రమాః
అహో రాత్రిం జ్ఞానకాంతి
ర్దీయతే గురుణైవహి!!

26. అతివృష్టి రనావృష్టి
ర్దృశ్యతే మేఘ మండలే
కాలవృష్ట్యా శిష్యలోకం
పునాతిహి ఘనో గురుః!!

27. రత్నాని సంతి వారాశౌ
యాదాంసి భయదానిచ
గురూ రత్నాకరో నూనం
కదాపి న భయంకరః!!

28. క్షమావిష్టాపి భూదేవీ
కంపతే హి తదా తదా
ఆచార్యస్య కృపాభూమౌ
కంపనం న విజాయతే!!

29. చంద్రోఽపి చంద్రికా దానే
పక్షపాత గుణాన్వితః
నిరతం గురు చంద్రేణ
దీయతే జ్ఞాన చంద్రికా!!

30. ప్రాణేభ్యోఽపి గరీయాంసః
గురోశ్శిష్యా న సంశయః
శుక్రాచార్య స్స్వశిష్యాయ
సాహసం కృతవాన్ ఖలు!!

25. సూర్యుడు పగటిభాగమునందే, చంద్రుడు రాత్రిభాగమునందే కాంతిని ప్రసాదించును. కాని రేయి, పగలు అను భేదము లేకుండగా జ్ఞానకాంతిని ప్రసాదించువాడు గురువు మాత్రమే.

26. మేఘమండలములో అతివృష్టి, అనావృష్టి కనబడును. కాని గురుమేఘము తగిన కాలములో తగినవిధముగా జ్ఞానమును వర్షించి, శిష్యలోకమును పవిత్రముగా చేయును.

27. సముద్రములో రత్నములు ఉండును. వానితోబాటు భయంకరములైన జలజంతువులు కూడ ఉండును. కాని గురువు శిష్యులపాలిటి రత్నాకరునిగనే ఉండును తప్ప ఎన్నడును భయము గొల్పువాడు కాడు.

28. ఓర్పునకు మారుపేరు భూదేవి. అయినను అప్పుడప్పుడు కంపించుచునే యుండును. కాని ఆచార్యుని కృపాభూమియందు మాత్రము ఎన్నడును కంపనమన్నదే పుట్టదు.

29. చంద్రుడు వెన్నెలను ఇచ్చుటలో పక్షపాత గుణమున్నది. అనగా శుక్ల పక్షమునందే ఇచ్చును, కృష్ణ పక్షమునందు ఈజాలడు. కాని గురుచంద్రుడు నిరంతరాయముగా జ్ఞానమనే వెన్నెలను శిష్యులకు ఇచ్చుచునే ఉండును.

30. గురువునకు శిష్యులు ప్రాణముకంటె మిన్న. ఇందులో సందేహము లేదు. శుక్రాచార్యుడు తన శిష్యుడైన కచుని రక్షించుటకు తన ప్రాణములను కూడ పణముగా పెట్టి సాహసించెను కదా!

31. త్రయీ వేద్యం గురోర్వాక్యం
త్రయీ వేద్య సమో గురుః
గురుదూషణ పాపస్య
ప్రాయశ్చిత్తం న విద్యతే!!

32. గురుదేవ సమస్కార
శ్శత యజ్ఞ ఫలప్రదః
గురుదేవ తిరస్కారః
కోటియజ్ఞ ఫలాపహః

33. లాలితోఽపిచ యశ్శిష్యో
దారుణం ద్వేష్టి వై గురుమ్
స నరః పన్నగప్రాయః
పయఃపాయీ విషప్రదః!!

34. గురౌ కృతఘ్నుతా యేన
దర్శితా పాపకర్మణా
పూర్వ జన్మార్జితం పుణ్యం
సర్వం తస్య వినశ్యతి!!

35. గురుః కుప్యతిచేచ్ఛిష్యో
యాశీరితి విచింతయేత్
ప్రతినిందా న కర్తవ్యా
శిష్యేణోత్తమ చేతసా!!

36. హరేరపి గురుర్ముఖ్యో
హరాదపి గురుర్వరః
తావుభౌ గురుణా జ్ఞేయౌ
గురుస్సర్వాధికో మతః!!

31. గురు వాక్యము వేదముతో సమానమైనది. గురువు వేద వేద్యుడైన భగవంతునితో సమానుడు. అటువంటి గురువును దూషించినచో ఆ పాపమునకు ప్రాయశ్చిత్తమే లేదు.

32. గురువునకు నమస్కరించుటవలన నూరు యజ్ఞములు చేసిన ఫలము లభించును. కాని గురు తిరస్కారము కోటి యజ్ఞములు చేయగా వచ్చిన ఫలమును కూడ హరించివేయును.

33. గురువుచేత లాలింపబడిన శిష్యుడే వానిని దారుణముగా ద్వేషించినచో అతడు పాలు త్రాగి, విషమును క్రక్కు పాముతో సమానము.

34. ఏ పాప కర్ముడు గురువు విషయములో కృతఘ్నుతను చూపించునో అతని పూర్వజన్మార్జితమైన పుణ్యము సమస్తము నశించిపోవును.

35. ఉత్తముడైన శిష్యుడు ఒకవేళ గురువు ఏ కారణము చేతనైనను కోపించినచో దానిని దీవెనగా భావింపవలెనే కాని, ప్రతినింద చేయరాదు.

36. కేశవునికంటె గురువు ముఖ్యుడు. శివునికంటె గురువు శ్రేష్ఠుడు. ఆ ఇరువురు గురువుద్వారానే తెలిసికొనదగినవారు. కనుక గురువు సర్వాధికుడు.

37. అశక్తా మానవా ద్రష్టుం
తేజోరూపాం సరస్వతీమ్
తామేవ మానవాకారాం
గురుం దృష్ట్వా సమర్చయేత్!!

38. దైవే కృతాపరాధశ్చేద్
గురుర్భవతి రక్షకః
గురౌ కృతాపరాధశ్చే
న్న శక్తః కోఽపి రక్షితుమ్!!

39. వందే గురు పదద్వంద్వం
నిర్ద్వంద్వామృత దాయినమ్
విజ్ఞానవర్ధనం నిత్యం
దైవసాయుజ్య కారణమ్!!

40. కవితా గురుణా దత్తా
భాషయోస్సంస్కృతాంధ్రయోః
విజ్ఞానంచ గురోర్భిక్షా
గురుపాదం భజామ్యహమ్!!

41. జ్ఞానదీప ప్రదాతారం
గురుం నత్వా శ్రియం వ్రజేత్
దీపంచ దీపదం హిత్వా
హ్యనర్థ మధిగచ్ఛతి!!

42. సంస్కారో యేన మే దత్తో
దత్తాచ కవితా ఘనా
పాండిత్యం యేన మే దత్తం
తం గురుం ప్రణమామ్యహమ్!!

37. తేజోరూపిణి యైన సరస్వతిని మానవుడు ప్రత్యక్షముగా దర్శింపలేడు. కనుక ఆమెను మానవాకారములో ఉన్న గురువునందు దర్శించి, అర్చింపవలెను.

38. దేవుని విషయములో అపచారము చేసినచో ఆ పాపమునుండి గురువు రక్షింపగలడు. కాని గురువు విషయములో అపచారము చేసినచో ఎవ్వరును రక్షింపలేరు.

39. సాటిలేని అమృతమును అందించుచు, నిత్యమును విజ్ఞానమును వృద్ధి చేసి, దైవ సాయుజ్యమునకు కారణమైన గురు పదద్వంద్వమును నమస్కరించుచున్నాను.

40. సంస్కృతాంధ్ర భాషలలో కవిత్వము చెప్పగలుగు శక్తి గురునిచేతనే అనుగ్రహింపబడినది. నేడు నాకున్న విజ్ఞానమంతయు గురువొసగిన భిక్షయే. కనుక గురుపాదమును సేవింతును.

41. జ్ఞానదీపమును ప్రసాదించిన గురునకు నమస్కరించువాడు శ్రీమంతుడగును. జ్ఞానదీపమును గాని, ఆ దీపమును ప్రసాదించిన గురువును గాని విడిచిపెట్టినవాడు అనర్థమును పొందును.

42. ఎవరివలన నాకు సంస్కారము లభించినదో, ఎవరివలన గొప్పదైన కవిత్వము పట్టుబడినదో, ఎవరివలన పాండిత్యము ప్రాప్తించినదో అట్టి గురువును గూర్చి ప్రణమిల్లుదును.

43. దుష్ట రాక్షస సంహారే
వజ్రీ భవతి వాసవః
తమాంసి శిష్యలోకస్య
ద్యతి జ్ఞానాసినా గురుః!!

44. దుష్టాశ్శిష్యాః ప్రవర్తంతే
గురౌ ద్రౌష్ట్యం న వర్తతే
స్వ తనుచ్ఛేదకస్యాపి
శీతతాం కల్పతే ద్రుమః!!

45. దాసోఽహం గురుదేవస్య
గురుదేవేచ భక్తిమాన్
నహీచ్ఛామి నహీచ్ఛామి
స్వర్గంవాపి గురుం వినా!!

46. యథా పూజ్యతమో దేవ
స్తథా దేవగణా అపి
తథైవ గురుణా సాకం
పూజార్హా హి గురోర్జనాః!!

47. విత్తం గురుపద ద్వంద్వం
చిత్తం మే గురుపాదయోః
సర్వం గురు కృపాయత్తం
తస్మై శ్రీగురవే నమః!!

48. విశ్వదర్శీ గురుర్దేవ
శ్శిష్యాణాం విశ్వదర్శకః
గురుదర్శన మాత్రేణ
కరస్థం దృశ్యతే జగత్!!

43. దుష్ట రాక్షస సంహారమునకు ఇంద్రుడు వజ్రాయుధమును ధరించును. శిష్యుల అజ్ఞానపు చీకట్లను గురువు జ్ఞానమనే కత్తితో ఖండించును.

44. శిష్యులలో చెడ్డవారు ఉన్నా, గురువులో చెడ్డతనముండదు. తనను నరకుటకు వచ్చిన వానికి కూడ చెట్టు నీడను కల్పించును గదా!

45. గురువునకు నేను దాసుడను. గురువునందు నేను భక్తి కలిగిన వాడిని. గురువును విడిచి నేను స్వర్గమును కూడ కోరను, కోరను.

46. దేవునితోబాటు దేవగణములు కూడ పూజ్యులే అయినట్లు, గురువుతోబాటు గురువునకు సంబంధించిన వ్యక్తులందరు పూజార్హులే.

47. గురు పాదద్వంద్వమే నాకు విత్తము. గురుపాదములయందే నా చిత్తముండును. నాకు సంబంధించిన సమస్తము గురు కృపవలన లభించినదే. అటువంటి గురువునకు నమస్కారము.

48. గురుదేవుడు ప్రపంచమును చూచినవాడు, తాను చూచిన ఆ ప్రపంచమును తన శిష్యులకు చూపించువాడు. గురువును దర్శించినంతమాత్రముననే ప్రపంచమంతయు కరతలమునందే గోచరించును.

49. హరిశ్శ్వేతే శేషతల్పే
హరః పన్నగ భూషణః
గురుశ్శ్వేతే శిష్య చిత్తే
నిత్యం వాత్సల్య భూషణః!!

50. మందారో నాస్తి భూలోకే
కామధేనుర్న వర్తతే
తథాపీహ నమే చింతా
మమాస్తి గురురిత్యలమ్

51. తృణ ఖాదన మాత్రేణ
దీయతే హి పయో గవా
నమ్రతా పరితుష్టేన
గురుణా దీయతే సుధా!!

52. పయః పీత్వా విషం దత్వా
మోదతే ఖలు పన్నగః
శిష్య దౌష్ట్యవిషం హృత్వా
గురుణా దీయతే సుధా!!

53. గురుం నౌమి గురుం నౌమి
గురం నౌమి నిరంతరమ్
స్మరణం గురుదేవస్య
జన్మ సాఫల్య కారణమ్!!

54. వజ్రం వజ్రాంతరేణైవ
ఘట్టితం హి ప్రకాశతే
గురు చిత్తాబ్జ పత్రేణ
శిష్య వజ్రం ప్రకాశతే!!

49. హరి శేషతల్పముపై శయినించును. హరుడు పామును భూషణముగా ధరించును. కాని గురువు శిష్యుల మనస్సులో నిద్రించును. వారిపై వాత్సల్యమునే భూషణముగా ధరించును.

50. భూలోకమునందు కల్ప వృక్షము లేదు, కామధేనువు కూడ లేదు. అయినను చింత లేదు. నాకు గురువు ఉన్నాడు చాలును.

51. గడ్డి తినినంత మాత్రమున సంతోషించిన గోవు పాలనిచ్చును. తనయెడల వినయముగా ఉన్నంత మాత్రమునకు ఆనందించే గురువు అమృతమును అందించును.

52. పాము పాలు త్రాగి, విషమును గ్రక్కి ఆనందించును. గురువు శిష్యుల మనసు మూలలలో దాగిన విషమును హరించి, వారికి అమృతమును అందించును.

53. గురువును నమస్కరింతును. గురువును నమస్కరింతును. నిరంతరము గురువును నమస్కరింతును. గురుదేవ స్మరణము జన్మ సాఫల్య కారణము.

54. వజ్రమునకు ప్రకాశము రావలెనన్న మఱొక వజ్రముతోనే ఒరిపిడి పెట్టవలెను. కాని గురువు తన మానస పద్మ దళముతో శిష్య వజ్రమునకు ప్రకాశము కలిగించును.

55. ఇంధనం పావకో భుక్త్వా
వర్ధతేచ ప్రకాశతే
తథైవ శిష్య లోకస్య
గురు జీవనమింధనమ్!!

56. నాభిజానామ్యహం మంత్రం
నాభిజానామి తాంత్రికమ్
గురుం జానే గురోరాశీ
ర్బలం జానామ్యహర్నిశమ్!!

57. గురుచిత్తం మహాపద్మం
తత్ర తిష్ఠతి భారతీ
గురుహీనం నరం వాణీ
పరిత్యజతి దూరతః!!

58. గురుణోక్తం వచో మంత్రో
గురుసేవా హ్యుపాసనా
వైకుంఠం గురు సాన్నిధ్యం
గురువందనమాచరేత్!!

59. రక్షణం శిష్టలోకస్య
శిక్షణం చ ఖలాత్మనామ్
భగవల్లక్షణం ప్రోక్తం
గురూ రక్షతి కేవలమ్!!

60. సదృశం నవనీతేన
గురోశ్చిత్తం న సంశయః
తప్తంచ ఘృత రూపేణ
సేవ్యతేహి బుభుక్షుభిః!!

55. అగ్ని ఇంధనమును భుజించి, వృద్ధి పొంది, ప్రకాశించును. అటులే శిష్యుల వృద్ధికి, ప్రకాశమునకు గురు జీవనమే ఇంధనముగా ఉపయోగపడును.

56. నాకు మంత్రము తెలియదు. తంత్రము తెలియదు. కాని గురువునెఱుగుదును. ఎల్లప్పుడు వారి దీవెనకు గల బలమునెఱుగుదును.

57. గురుని మనస్సు మహాపద్మము. దానియందు భారతి నివసించును. గురువు లేని నరుని సరస్వతి దూరముగా పరిత్యజించును.

58. గురువు చెప్పిన మాట మంత్రము. గురు సేవ ఉపాసన. గురు సాన్నిధ్యమే వైకుంఠము. కనుక గురువునకు వందనమొనర్పవలెను.

59. శిష్టులను రక్షించుట, దుష్టులను శిక్షించుట అనునవి భగవల్లక్షణములుగా చెప్పబడినవి. కాని గురువుయొక్క లక్షణము మాత్రము కేవలము రక్షించుటయే.

60. గురువు చిత్తము వెన్నపూస వంటిది. అది తపింపబడికూడ నేయిగా మారి ఆకొన్నవారిచే ఆస్వాదింపబడును. అట్లే గురువుకూడ శిష్యుల వలన తపింపబడినను, మఱింతగా వారికి ఉపయోగపడును.

51. తారాస్సహస్రశ స్సన్తు
శశినా భాతి యామినీ
బాంధవా బహవ స్సన్తు
గురుణా భాతి జీవికా!!

62. గురావసత్య వాదీచ
తథైవ గురు వంచకః
మాభూత్ శక్రోఽపి తత్పాపం
పరిహర్తుమలం నహి!!

63. దేవస్య రామచంద్రస్య
కృష్ణస్యాపి జగద్గురోః
సన్త్యేవ గురవస్తస్మా
న్న కదాపి గురుం త్యజేత్!!

64. జిహ్వాగ్రే గురుదేవస్య
వర్తతే యా సరస్వతీ
తస్యాః కృపా విశేషేణ
లోకోఽయం వర్ధతే సదా!!

65. గురుభూషణ శీలేన
భూషితా భాతి భారతీ
గురుదూషణ శీలేన
వాణీ భవతి దూషితా!!

66. వైకల్యం జాయతే చిత్తే
యదా యస్య తదా స హి
గురుమేవాశ్రయే న్నోచేద్
వ్యసనేషు పతిష్యతి!!

61. వేలకొలది చుక్కలు ఆకాశంలో ఉన్నా రాత్రి చంద్రుని వలననే శోభించును. అట్లే బంధువులు ఎందరున్నా బ్రతుకు ప్రకాశించేది గురువు వలననే.

62. ఆచార్యునకు అసత్యము చెప్పవద్దు. గురువును వంచింప వద్దు. ఆ పాపమును పరిహరించుటకు ఇంద్రుడు కూడ సమర్థుడు కాదు.

63. భగవంతుడైన రామచంద్రునికి, జగద్గురువైన శ్రీకృష్ణునకు కూడ గురువులు ఉన్నారు కదా! కనుక ఎన్నడును గురువును విడువరాదు.

64. గురుదేవుని జిహ్వాగ్రమునందు ఏ సరస్వతి వర్తిల్లుచున్నదో ఆమె కృపా విశేషముచేతనే ఈ లోకము ఎల్లప్పుడు వర్ధిల్లుచున్నది.

65. గురువును భూషించినచో వానివలన భారతి భూషింపబడును. గురువును దూషించినచో వానివలన వాణి దూషిత యగును.

66. ఎప్పుడు ఎవనికి మనస్సులో వైకల్యము సంభవించునో అప్పుడు అతడు వెంటనే గురువును ఆశ్రయింప వలెను. లేకున్నచో వ్యసనముల బారిన పడును. (వ్యసనమనగా ఆపద అనియు అర్థము.)

67. రామాయణ కథా కావ్య
స్రష్టా వాల్మికినాపిచ
నారదో గురు రూపేణ
ప్రస్తావిత ఇతి స్మరేత్!!

68. సంధ్యయో శ్శాంత రూపోఽర్కో
మధ్యాహ్నే చండ భానుమాన్
గుర్వర్క స్సర్వ కాలేషు
శాంత ఏవాభిదృశ్యతే!!

69. రాకాయాం కాంతిమాన్ పూర్ణో
దర్శేతు సహి దృశ్యతే
చంద్రమా గురు చంద్రస్తు
శోభతే హృది నిత్యశః!!

70. గురురేవ పితా మాతా
గురుర్బంధు ర్గురుస్సఖా
గురుర్దేవో జగత్సర్వం
గురురేవాభిదృశ్యతే!!

71. సత్యలోకే స్థితో బ్రహ్మే
సత్యే గురుకృపా స్థితా
అసత్యభాషణా చ్ఛిష్యో
బ్రహ్మద్రోహీ న సంశయః!!

72. సత్యా విద్యా గురుప్రోక్తా
యయా శిష్యోఽభివర్ధితః
తస్మా ఉక్త్వా మృషా వాక్యం
గురవే స వినశ్యతి!!

67. రామాయణ కథాకావ్య సృష్టికర్త ఆదికవి వాల్మీకి కూడ తన గురువుగా నారదుని మునుముందుగా ప్రస్తావించిన సంగతిని గుర్తించవలెను. (ఎంతటివానికైనా గురువు తప్పనిసరి అని దీనిని బట్టి గ్రహింపవలెను.)

68. సూర్యుడు ఉదయ సాయం సంధ్యలలో శాంతముగా ఉన్నా, మధ్యాహ్న కాలములో తీవ్ర కిరణములతో తీక్ష్ణముగా ప్రకాశించును. కాని గురు సూర్యుడు ఎల్లకాలము శాంతముగానే కనిపించును.

69. పూర్ణిమనాడు చంద్రుడు నిండుగా ప్రకాశించును. అమావాస్యనాడు అసలు కనిపించడు. కాని గురుచంద్రుడు శిష్య హృదయములందు ఎల్లకాలములందు శోభించును.

70. గురువే తల్లి, గురువే తండ్రి, గురువే బంధువు, గురువే సఖుడు, గురువే దేవుడు, సమస్త ప్రపంచము గురువుగానే కనబడుచున్నాడు.

71. బ్రహ్మ సత్యలోకమునందుండును. గురుకృప సత్యమునందుండును. గురువునకు అసత్యము పల్కిన శిష్యుడు బ్రహ్మద్రోహి. సంశయము లేదు.

72. గురువు చెప్పిన విద్య సత్యమైనది. ఆ సత్యము చేతనే శిష్యుడు వృద్ధి పొందును. అటువంటి గురువునకు అసత్యవాక్యము చెప్పినవాడు నశించును.

73. సత్యమేవ హి వక్తవ్యం
గురవే జ్ఞానదాయినే
యేనాసత్యం గురోః ప్రోక్తం
తస్య శ్రేయో వినశ్యతి!!

74. గురుదేవార్చనం సత్యం
సత్యం శిష్య విభూషణమ్
సత్యం వినా గురౌ భక్తి
ర్ధ్యానం భవతి వంచనా!!

75. జ్ఞానం యజ్జీవనాధారం
వర్ధతే యేన సద్యశః
తద్విజ్ఞాన ప్రదాతారం
గురుదేవం న విస్మరేత్!!

76. ఆచార్య భాస్కరం వందే
యస్య జ్ఞాన గభస్తిభిః
స్థితం మే మానసక్షేత్రే
తమో ధావతి దూరతః!!

77. గురుం చంద్రమసం వందే
యోహి వాత్సల్య చంద్రికామ్
అజ్ఞాన తాపతప్తస్య
దత్వా మే పాతి శీతతామ్!!

78. అనేకే జంతవో లోకే
తేషాం మధ్యే నరో ఘనః
ఘనతా కారణం జ్ఞానం
తద్దాతారం న విస్మరేత్!!

73. జ్ఞానమును ప్రసాదించు గురువుతో సత్యమునే పలుకవలయును. ఎవడు ఆచార్యునకు అసత్యము చెప్పునో వాని శ్రేయస్సు నశించును.

74. సత్యమే గురుదేవ అర్చనము. సత్యమే శిష్యునికి అలంకారము. సత్యమును విడిచి, గురువునందు భక్తిని చూపించినను అది నిశ్చయముగా వంచనయే అగును.

75. ఏ జ్ఞానము జీవనాధారమో, ఏ జ్ఞానముచేత మంచి కీర్తి వృద్ధి పొందినదో అటువంటి జ్ఞానమును ప్రసాదించిన గురుదేవుని విస్మరింపరాదు.

76. నా మానస క్షేత్రములో ఉన్న అజ్ఞానపు చీకటి ఎవని జ్ఞాన కాంతికిరణాలతో దూరముగా పారిపోయినదో అటువంటి ఆచార్య భాస్కరునికి నమస్కరించుచున్నాను.

77. అజ్ఞానమనే తాపముతో తపించిపోవుచున్న నాకు ఏ వ్యక్తి తన వాత్సల్యమనే చల్లని వెన్నెలను ప్రసాదించి రక్షించుచున్నాడో అట్టి గురుచంద్రునకు నమస్కరించుచున్నాను.

78. లోకములో ఎన్నో రకములైన జంతువులున్నవి. వాటిలో నరుడే ఘనుడు. ఆ ఘనతకు కారణము జ్ఞానము. అట్టి జ్ఞానమును ప్రసాదించిన గురువును స్మరింపవలెను.

79 నావిష్ణు రర్చయేద్విష్ణుం
నా రుద్రో రుద్రమర్చయేత్
శిష్యస్తు శిష్య భావేన
గురు వందనమాచరేత్!!

80. ప్రథమం శిష్య భావేన
గురుపాద సరోరుహమ్
ధ్యాత్వా హ్యనంతరం రుద్రం
రుద్ర భావేన పూజయేత్!!

81. అపరాధ శతంనాపి
సహతే క్షమయా గురుః
స ఏవ క్షుభ్యతే దృష్ట్వా
స్వల్పామపి కృతఘ్నతామ్!!

82. గురోర్మౌనమపి వ్యాఖ్యా
కిము తస్యహి భాషణమ్
వాక్యం గురుముఖోద్భూతం
భావయేత్ ప్రణవాత్మకమ్!!

83. గురుణా జాయతే జ్ఞానం
ధనం జ్ఞానేన లభ్యతే
ధనేన లభతే సౌఖ్యం
సుఖమూలం గురుం స్మరేత్!!

84. జననీ జన్మభూమిశ్చ
స్వర్గాదపి గరీయసీ
ఇతి జ్ఞానం యేన లబ్ధం
తస్మై శ్రీగురవే నమః!!

79. విష్ణువు కానివాడు విష్ణువును అర్చింపరాదు. రుద్రుడు కానివాడు రుద్రుని అర్చింపరాదు. అనగా జీవ దేవులకు అభేదాన్ని భావన చేయుచు, భగవంతుని అర్చింపవలెను. కాని గురువును అర్చించునపుడు మాత్రము తనను తాను శిష్యునిగానే భావింపవలెను.

80. ముందుగా శిష్య భావముతో గురు పాదపద్మమును ధ్యానము చేసి, ఆ పిదప తనను తాను రుద్రునిగా భావించుకొని, రుద్రుని అర్చింపవలెను.

81. శిష్యుడు నూరు అపరాధములు చేసినను ఓర్పుతో గురువు సహించును. కాని, కృతఘ్నతను ఏ చిన్నపాటిగా చూపించినను గురువు మనసు క్షోభించును. కనుక గురువు విషయములో ఎంతమాత్రము కృతఘ్నతను చూపింపరాదు.

82. గురువుయొక్క మౌనము కూడ వ్యాఖ్యయే అందురు. అటువంటిది వాని మాట ఇంకెంత గొప్పది. అందువలన గురువు నోట వచ్చు ప్రతివాక్యమును ప్రణవముతో సమానముగా భావింపవలెను.

83. గురువువలన జ్ఞానము లభించును. జ్ఞానమువలన ధనము లభించును. ఆ ధనము సుఖమును ఇచ్చును. ఆ సుఖమునకు మూలము గురువే అను విషయమును గుర్తుపెట్టుకొనవలెను.

84. కన్నతల్లి, తల్లినేల స్వర్గముకంటె గొప్పవను జ్ఞానము ఎవరివలన నాకు లభించినదో అట్టి గురుమూర్తికి నమస్కారము.

85. భూతకాలిక విజ్ఞానం
వర్తమాన గతిస్తథా
భవిష్యద్దర్శనంచైవ
లభతే కృపయా గురోః!!

86. సద్గురు శ్శంకరాచార్యో
ముని ర్వ్యాసో జగద్గురుః
తయోర్గురు ర్జగన్నాథ
స్త్రత్రయం స్వగురౌ స్థితమ్!!

87. గురు ర్బృహస్పతి స్స్వర్గే
శుక్రాచార్యో రసాతలే
నరాణాం గురుహీనానాం
కా గతిః పరిదృశ్యతే ?

88. భ్రమతి భ్రమరో భూత్వా
గురు పాదారవిందయోః
పీత్వా విజ్ఞాన పీయూషం
చిత్తం మే పరితుష్యతి!!

89. యేన మే కవితా లబ్ధా
తయా తదభిపూజనమ్
పావనం భవరోగఘ్నం
క్రియతే గురు పూజనమ్!!

90. ప్రదత్తం యేన వైదుష్యం
భాషయో స్సంస్కృతాంధ్రయోః
స ఏవహి మమారాధ్యః
క్రియతే గురు వందనమ్!!

85. భూతకాలిక విజ్ఞానము, వర్తమాన గతి, భవిష్యద్దర్శనము గురువుయొక్క కృపచేతనే లభించును.

86. శంకర భగవత్పాదులు సద్గురువు. వ్యాసమహర్షి జగద్గురువు. వారిరువురికి గురువు జగన్నాథుడైన భగవంతుడు. ఆ ముప్వురు స్వీయ గురువునందు ఉందురు.

87. స్వర్గలోకములో బృహస్పతి, రసాతలమునందు శుక్రాచార్యులు గురువులుగా ఉన్నపుడు కేవల మానవులకు గురువు లేకున్నచో వారికి గతి కనుపట్టునా?

88. గురువుగారి పాదపద్మములయందు తుమ్మెదవలె వ్రాలి, ఆందలి విజ్ఞానామృతమును గ్రోలి, నా చిత్తము ఆనందమును పొందును.

89. ఏ గురువువలన కవిత్వము లభించినదో వానిని ఆ కవిత్వముతోడనే అర్చించుట పవిత్రమైన, సంసార రోగమును రూపుమాపగల కార్యము. ఆ విధముగా గురువందనమును చేయుచున్నాను.

90. సంస్కృతాంధ్ర భాషలలో పాండిత్యము ఎవరు నాకు ప్రసాదించారో వారే నాకు ఆరాధ్యులు కదా! అందుకనే గురు వందనమును చేయుచున్నాను.

91. గురో రసత్యవాదీచ
యశ్చ ప్రోత్సహతేన్నృతమ్
తస్య నాస్తి భువి శ్రేయో
నాస్తి తస్య పరాగతిః!!

92. మాతా పూజ్యా పితా పూజ్యో
గురుః పూజ్యో నిరంతరమ్
తద్ద్వేషీ దేవభక్తో -పి
క్షయం ప్రాప్నోత్యసంశయః!!

93. నేత్రేహి పశ్యతో లోకం
సమీపే యచ్చ వర్తతే
తృతీయం గురు దత్తాక్షి
సర్వం సర్వత్ర పశ్యతి!!

94. అసత్యే భౌతికే లోకే
సత్యదార్శనికో గురుః
సత్యమేవ గురో రూపం
గురో స్సత్యం సమాచరేత్!!

95. శివాయ గురురూపాయ
గురవే శివరూపిణే
యః కరోతి నమస్కారం
స ఏవ లభతే జయమ్!!

96. సాక్షాత్కార స్సరస్వత్యా
గురో ర్భిక్షా న సంశయః
భిక్షాం స్వీకృత్య జన్మాంతం
కృతజ్ఞ స్స భవేద్ గురౌ!!

91. గురువునకు అసత్యము చెప్పినను, అసత్యము చెప్పుమని ఇతరులను ప్రోత్సహించినను అట్టి వానికి ఈలోకములో శ్రేయస్సు కలుగదు. అంతేకాక జీవితానంతరమందు కూడ ఉత్తమగతులు లభింపవు.

92. ఎల్లప్పుడు తల్లి పూజ్యురాలు. తండ్రి పూజ్యుడు. గురువు పూజ్యుడు. వారియందు ద్వేషభావము కలవాడు దేవునియెడ భక్తుడయ్యును నాశనమును పొందును. సందేహము లేదు.

93. మన కన్నులు సమీపమునందున్న లోకమును మాత్రమే చూడగలుగును. కాని గురువుచేత అనుగ్రహింపబడిన జ్ఞానరూపమయిన తృతీయ నేత్రము మొత్తము విశ్వమును దర్శింపగలదు.

94. అసత్యస్వరూపమైన ఈ భౌతిక లోకంలో సత్యమును దర్శింపజేయువాడు గురువు. సత్యమే గురువుయొక్క రూపము. కనుక గురువువద్ద సత్యమునే పలుకవలెను.

95. గురువులో శివుని, శివునిలో గురువును దర్శించి నమస్కరించువాడు మాత్రమే జయమును పొందును.

96. సరస్వతీ సాక్షాత్కారము నిస్సంశయముగా గురుదేవుని భిక్షయే. ఆ భిక్షను స్వీకరించినవాడు జన్మాంతము వానియెడల కృతజ్ఞుడై ఉండవలయును.

97. గురుర్యజ్ఞ స్సోమయాజీ
గురుర్ద్రవ్యంచ తత్ఫలమ్
గురుం త్యక్త్వా కృతో యజ్ఞో
నిష్ఫలో నాత్ర సంశయః!!

98. గురుదేవస్య విజ్ఞానం
జీవితానుభవస్తథా
శ్రేయసే శిష్య లోకస్య
తస్మాన్నిత్యం గురుం స్మరేత్!!

99. గురుం నత్వా సదా భక్త్యా
శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్
గురుం హిత్వా లోభ బుధ్యా
క్షయం ప్రాప్నోత్యహర్నిశమ్!!

100. గురు ప్రశంసా పుణ్యాయ
పాపాయ గురు దూషణమ్
గురు పీడోద్భవం పాపం
ఘుజ్ఞేనాపి న నశ్యతి!!

101. గురుణా శ్రేయ ఆసాద్య
తస్మై ద్రోహం కరోతి యః
ముచ్యతే సర్వ సంపద్భ్య
స్సహి ప్రాప్నోతి దుర్యశః!!

102. గురోరాజ్ఞా శిరోధార్యా
నోల్లంఘ్యాహి కదాచన
ఆచార్యః పూజ్యతే యత్ర
భాసతే తత్ర భారతీ!!

97. గురువే యజ్ఞము. గురువే సోమయాజి. గురువే హవ్యము. గురువే ఆ యజ్ఞఫలము. అట్టి గురువును విడిచి, చేసిన యజ్ఞము నిష్ఫలమగుననుటలో సందేహము లేదు.

98. గురుదేవుని విజ్ఞానము, అటులే వాని జీవితానుభవము శిష్యలోక శ్రేయస్సునకే ఉపయోగపడును. కనుక నిత్యము గురుదేవుని స్మరింపవలెను.

99. ఎల్లప్పుడు భక్తితో గురువునకు నమస్కరించి, అత్యుత్తమమైన శ్రేయస్సును పొందును. లోభబుద్ధితో గురువును పరిత్యజించినవాడు నిత్యము నాశనమును పొందును.

100. గురువును ప్రశంసించినచో పుణ్యము లభించును. గురువును దూషించినచో పాపము కలుగును. గురువును పీడించుటవలన కలిగిన పాపము యజ్ఞము చేసినను తొలగదు.

101. గురువువలన శ్రేయస్సును పొంది, వానికే ఎవడు ద్రోహము చేయునో వాని సంపదలన్నియు తొలగిపోవును. అదనముగా అపకీర్తి వచ్చును.

102. గురువుయొక్క ఆజ్ఞను శిరస్సుతో ధరింపవలెను. ఎన్నడును ఆ ఆజ్ఞను ఉల్లంఘింపరాదు. ఎక్కడ ఆచార్యుడు పూజింపబడునో అక్కడే భారతి ప్రకాశించును.

103. సుశిష్య స్స్వప్న కాలేఽపి
గురు ద్రవ్యం న వాంఛతి
కాలసర్ప సమం మత్వా
పరిత్యజతి దూరతః!!

104. గురూణాం మనసి క్షోభో
యేన శిష్యేణ జాయతే
తత్కృతా నిష్ఫలాః పూజాః
పూర్వ పుణ్యం చ నశ్యతి!!

105. గురుమాశ్రిత్య సద్విద్యాం
ప్రాప్య లోకే యశోధనమ్
కృతఘ్నో భవతి భ్రష్ట
శ్శిష్టో యాతి కృతజ్ఞతామ్!!

106. ప్రత్యక్షంవా పరోక్షంవా
గురుం నిందతి యః పుమాన్
తం జహాతి మహావాణీ
మహాలక్ష్మ్యా స ముచ్యతే!!

107. గురుర్దేవో గురుర్దేవో
గురుర్దేవో న సంశయః
గురుం నత్వా పుమాన్ శ్రీమాన్
సర్వం శ్రేయోఽధిగచ్ఛతి!!

108. మకరందం సమాసాద్య
గురుదేవ పదాబ్జయోః
శ్రేయాంసి శిష్య సారంగః
ప్రాప్నోతీహ పరత్రచ!!

103. ఉత్తమ శిష్యుడు కలలోకూడ గురుద్రవ్యమును కోరడు. కాలసర్పముతో సమానమైనదానినిగా భావించి, గురుద్రవ్యమును దూరముగా విడిచిపెట్టును.

104. ఏ శిష్యునివలన గురువు మనసు క్షోభించునో అట్టి శిష్యుడు చేసిన పూజలన్నియు నిష్ఫలములు. పూర్వము చేసిన పుణ్యముకూడ నశించిపోవును.

105. గురువును ఆశ్రయించి, మంచి విద్యను, యశస్సును, ధనమును (యశోధనమును) పొంది, భ్రష్టుడు కృతఘ్నుడగును. శిష్టుడు కృతజ్ఞతను పొందును.

106. ఏ వ్యక్తి ప్రత్యక్షముగా గాని, పరోక్షముగా గాని గురువును నిందించునో వానిని సరస్వతి, లక్ష్మి కూడ విడిచివేయుదురు.

107. గురువే దేవుడు. గురువే దేవుడు. గురువే దేవుడు సందేహము లేదు. గురునకు నమస్కరించిన వ్యక్తి శ్రీమంతుడై పరిపూర్ణముగా శ్రేయస్సును పొందును.

108. గురుదేవుని పాదపద్మములలోని మకరందమును బాగుగా ఆస్వాదించిన శిష్యుడనే తుమ్మెద ఈలోకములోను, పరలోకములోను కూడ శ్రేయస్సులను పొందును.

109 వేదానాం ప్రణవ శ్రేష్ఠో
దేవతానాం గురుర్ఘనః
యేన మే జన్మ సాఫల్యం
తస్మై శ్రీగురవే నమః!!

110. నదీనాముత్తమా గంగా
భూధరాణాం హిమాలయః
దాతౄణాం జ్ఞానదశ్రేష్ఠ
స్తస్మై శ్రీగురవే నమః!!

111. శ్రీకరీ చాక్షరా విద్యా
శ్రేయోదాత్రీచ శర్మదా
యేన మే హృది నిక్షిప్తా
తస్మై శ్రీగురవే నమః!!

ఇతి కౌండిన్యసగోత్రేణ కడిమిళ్ళ వంశసంజాతేన బుచ్చమాంబా శేషయ్య దంపత్యోః పౌత్రేణ, భారతీ వేంకటరామయ్యశాస్త్రి దంపత్యోః పుత్రేణ, గురుసహస్రావధానినా వరప్రసాదేన శైష్యోపాధ్యాయికాయాః పవిత్రతా పరిరక్షణాయ ప్రణీతమ్ గురువందనమ్ సంపూర్ణమ్.

109. వేదములలో ఓంకారము గొప్పది. దేవతలలో గురువు గొప్పవాడు. ఏ గురువువలన నా జన్మ సఫలమైనదో అట్టి గురువునకు నమస్కారము.

110. నదులలో ఉత్తమమైనది గంగ. పర్వతములలో గొప్పది హిమాలయము. దాతలలో జ్ఞానదాత గొప్పవాడు. అట్టి జ్ఞానదాతయైన గురువునకు నమస్కారము.

111. శ్రీలను కలిగించునది, ఎన్నటికిని నశింపనిది, శ్రేయస్సును కలిగించునది, సుఖమును ఇచ్చునది అయిన విద్య నా హృదయమునందు ఎవనిచే ఉంచబడినదో అట్టి గురుమూర్తికి నమస్కారము.



నటసమ్రాట్ అక్కినేనితో



గానగంధర్వ బాలమురళీకృష్ణతో



दासोऽहं गुरुदेवाना
मुत्तमज्ञानदायिनाम्
वात्सल्यपरिपूर्णाना
मन्वहं हितभाषिणाम्

गुरुसहस्रावधानी
डा. कडिमिल्ल वरप्रसादः